# అథ త్రిచత్వారింశో%ధ్యాయః

## ఆచార్య పూజ

శౌనక ఉవాచ |

ఆచార్యపూజనం బ్రూహి సూత వ్యాసగురో%ధునా | గ్రంథస్య శ్రవణాంతే హి కిం కర్తవ్యం తదప్యహో || 1

శౌనకుడు ఇట్లు పలికెను -

ఓ సూతా ! నీకు వ్యాసుడు గురువు. ఇపుడు ఆచార్యుని పూజను గురించి చెప్పుము. గ్రంథమును శ్రవణము చేయుట పూర్తి అయిన పిదప ఏమి చేయవలెను ? ఆ విషయమును కూడ చెప్పుము (1).

సూత ఉవాచ |

పూజయేద్విధివద్భక్త్యాచార్యం శ్రుత్వా కథాం పరామ్ | గ్రంథాంతే విధివద్దద్యాదాచార్యాయ ప్రసన్నధీః || 2

తతో వక్తారమానమ్య సంపూజ్య చ యథావిధి | భూషణైర్హస్త కర్ణానాం వస్త్రై#్ర స్స్రమ్యాదిభిస్సుధీః || 3

శివపూజా సమాప్తౌ తు దద్యాద్ధేనుం సవత్సికామ్ | కృత్వాసనం సువర్ణస్య పలమానస్య సాంబరమ్ || 4

తత్రత్రాస్థాప్య శుభం గ్రంథం లిఖితం లలితాక్షరైః | ఆచార్యాయ సుధీర్దద్యాన్ముక్తస్స్యాద్భవబంధనైః || 5

గ్రామో గజో హయశ్చాపి యథాశక్త్యపరాణి చ | మునే సర్వాణి దేయాని వాచకాయ మహాత్మనే || 6

విధాన సహితం సమ్యక్ శ్రుతం హి సఫలం స్మృతమ్ | పురాణం శౌనకమునే సత్యమేవోదితం మయా || 7

తస్మాద్విధానాదుక్తం తు శృణు యాద్భక్తితో మునే | పురాణం నిగమార్థాఢ్యం పుణ్యదం హృదయం శ్రుతేః || 8

ఇతి శ్రీ శివ మహాపురాణ    ఉమాసంహితాయాం వ్యాసపూజన ప్రకారో నామ త్రిచత్వారింశో%ధ్యాయః (43).

సూతుడు ఇట్లు పలికెను-

శ్రేష్ఠమగు కథను వినిన పిదప ఆచార్యుని యథావిధిగా పూజించవలెను. గ్రంథము పూర్తి అయిన తరువాత భక్తుడు ప్రసన్నమగు మనస్సు గలవాడై యథావిధిగా ఆచార్యునకు దానమును చేయవలెను (2). తరువాత వివేకి యగు భక్తుడు ప్రవచనకర్తకు ప్రణమిల్లి యథావిధిగా చక్కగా పూజించి చేతులకు చెవులకు భూషణములను, నాజూకైన వస్త్రములు మొదలగు వాటిని సమర్పించవలెను (3). శివపూజ పూర్తి అయిన తరువాత వివేకియగు భక్తుడు గోవును, దూడతో సహా ఆచార్యునకు ఈయవలెను. పలము బరువు గల బంగారముతో ఆసనమును నిర్మించి దానిని మంచి వస్త్రముతో కప్పి దానిపై శుభకరమగు గ్రంథమును స్థాపించవలెను. ఆ గ్రంథము సుందరమగు అక్షరములచే వ్రాయబడి యుండవలెను. దానిని ఆచార్యునకు ఈయవలెను. ఇట్లు చేయు భక్తుడు సంసారబంధములనుండి విముక్తుడగును (4,5). ఓ మునీ ! మహాత్ముడగు ప్రవచనకర్తకు గ్రామము, ఏనుగు, గుర్రము మొదలగు వాటిని అన్నింటినీ యథాశక్తిగా ఈయవలెను (6). ఓ శౌనకమహర్షీ! పురాణమును యథావిధిగా శ్రవణము చేసినచో, ఫలము లభించునని చెప్పబడినది. నేను సత్యమును మాత్రమే చెప్పుచున్నాను (7). ఓ మునీ! కావున వేద రహస్యములతో నిండియున్నది, పుణ్యప్రదము, వేదహృదయము అగు పురాణమును వక్త యథావిధిగా చెప్పగా భక్తితో వినవలెను (8).

శ్రీ శివ మహాపురాణమునందలి ఉమాసంహితయందు వ్యాస పూజాప్రకారము అనే నలుబది మూడవ అధ్యాయము ముగిసినది (43).